సీ. సత్కీర్తి పతికిని సత్కుక్షిలోపల భువనత్రయంబును బొదలుచుండు
గావున నింతకు నీవె తండ్రివి నీదుధనము యాచకులకుఁ దల్లి సుమ్ము
తమపితృధనము లేతటి నెనఁగ్రకొన్న నిది భాగ మని భువి నెన్నఁబడు నె
తనకుటుంబముఁ బ్రోవఁ దా నెంత ప్రియపడ్డ నతఁడుమహోదారుఁడనఁగఁదగు నె
తగదుగానినీయుదారత్వమేమని, పొగడవచ్చుఁ *దొంటిరంతు పొంటెఁదలఁప
శమితకుజనతర్క జయరమాసంపర్క, విమతకైరవార్క విక్రమార్క. ౨౪

క. జలములు పైఁబడక మహానల మాఱను శౌర్యభూషణా నీకోపా
నలము రిపుసతులకన్నుల, జలములు గనియాఱు నెంతసత్త్వం బిచటన్. ౨౫

క. కావున యశముఁ బ్రతాపము, నేవెరవునఁ బొగడఁజెల్లు నెవ్వరి సరిగాఁ
గావింపవచ్చు దీనులఁ, గావం బ్రోవంగ నీవె కారణ మగుటన్. ౨౬

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
నేవసుధేశు నీయెదుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వ ల
జ్జావశ మై చలింప దిఁక సద్గుణముందఱ సద్గుణాఢ్యుఁ బ్ర
స్తావన చేయనేరనియతం డతిమూఢుఁడు గానఁ జెప్పెదన్. ౨౭

గీ. విపులదుర్గ మైన వింధ్యపర్వతసీమఁ, జంద్రకాంతసౌధజాలరుచుల
రాజపురముతోడ రాయుచు బొంచిన, రత్నపురమునాఁబురంబు గలదు ౨౮

క. ఒకటొకటికంటెఁ బొడవునఁ, బ్రకటముగా నచటిహర్మ్యపంక్తులు దివి ము
ట్టికలశభవుచే వింధ్యా, ద్రికిఁ గృతమున నైన కొఱంతఁ దీర్చుచుండున్.

క. అందు జయసేనుఁ డనఁగఁ బు, రందరవైభవుఁడు †రాజరాజవదాన్యుం
డిందుధరభక్తినిరతుఁడు, వందిజనప్రియుఁడు మనుజవల్లభుఁ డుండున్. ౩౦

క. ఆనరనాయకు వేఁడిన, దీనులు ధనవంతు లగుచు దేశములోన
న్మానవనాథులక్రియ నతి,దానంబులఁ బరఁగుదురు ప్రదాత లనంగన్. ౩౧

సీ. అట్టివిజయసేనుఁ డధికసంపత్తితో నొకనాఁడు నవవసంతోత్సవంబు
సేయ నుద్యోగించె నాయవసరమునఁ గవులును బట్టును గాయకులును
నర్తకులును నిజకీర్తి నుతించుచు సరసభావంబున సరస నడువఁ
జెలువార వారకాంతలు సుగంధద్రవ్యహస్తలై కెలఁకుల నరుగుదేర
దొరలు లెంకలుహితులుమంత్రులునుగొలువ, నశ్వరత్నము నెక్కియుద్యానభూమి
కేగి యచ్చట నొకపొదరింటి క్రేవ, సుమచిరంబగు మాకందతరువుక్రింద. ౩౨

* తొంటిపాండెతలప. †రాజరాజౌదార్యం.

శా. అర్పింపందగు పూజలెల్లఁ దగుమర్యాద న్సముద్భించి కం
దర్పుం దత్ప్రియమిత్రుని న్సముచితోత్సాహంబునం గొల్చి యే
కార్పణ్యంబును లేక యింపెనయఁగాఁ గాశ్మీరకస్తూరికా
కర్పూరాదివసంతఖేలనములుం గావించె నుల్లాసి యై. ౮౩

క. జనవరుఁ డయ్యుత్సవమున, మనమలరఁగ యాచకులకు మాడలు పదివే
లును దొమ్మిదిలక్షలు గ్రక్కునని చ్చెం గీర్తి దిశలఁ గొనసాఁగంగన్. ౮౪

వ. ఆసమయంబున- ౮౫

ఉ. యాచకకల్పభూజ మగు నానరనాథు మహావదాన్యునిం
జూచితి వానిచేత నిలు చూఱలు గొన్నగతి న్సువస్తువు
ల్నాచతురత్వచిహ్నములునాఁ గయికొంటి సతంబు ధాత్రిలో
రాచగొనంబులం బరఁగురా జప్డుఁ గావున నెన్న నొప్పగున్. ౮౬

ఉ. అంచు నతండు రత్నపురియందలి మండలనాథచంద్రుఁ వ
ర్ణించిన నయ్యవంతిధరణీధరుఁ డాతని చాగ మాత్మలోఁ
గొంచెముగాఁ దలంచి *నిజకోశగృహాధిపుఁ డైన లెంక నీ
క్షించి యనంతదానగుణశీలసమగ్రత †నత్యుదారుఁడై. ౮౭

చ. ఇతని కనర్ఘరత్నములయిండ్లును గాంచనమందిరంబులుం
జతురతురంగసద్మములు సామజశాలలు నూపురాద్యలం
కృతిసదనంబులు న్వసనగేహములుం బరిపాటిఁజూపు స
మ్మత మగువస్తుజాతము సమస్తమునుం గొనిపోవని మ్మటన్. ౮౮

క. అనవుఁడు భాండాగారికుఁ, డును విస్మయమందుచుం గడుం బ్రియ మడరం
దనలోన వెలుఁగుపడ నా, తనిఁదోడ్కొని యరిగి వరుసఁ దద్గృహములలోన్.

వ మదశుకానుకృతంబు లగు మరకతంబులు ను, బరిపుష్పరాగంబు లగు
పుష్పరాగంబులు ను, ధామాధికంబు లగు గోమేధికంబులు ను, ప్రభాసఫ
లంబు లగు ముక్తాఫలంబులును, విడంబితబాలప్రవాళంబు లగు ప్రవాళం
బులును, నదృష్టవైదూర్యంబు లగు వైదూర్యంబులును, యమునానీరనీలం
బు లగు నీలంబులును, రుచిరజితవజ్రంబు లగు వజ్రంబులును, గల్పితపద్మ
రాగంబు లగు పద్మరాగంబులును, నవధీరితమేరుశిఖరంబు లగు కనకశిఖ
రంబులు ను, నధరీకృతార్కవాజు లగు తేజులు ను, నుపమితదిగ్గజంబు లగు

*నిజకోశగృహస్థితుఁడైన- †నత్యుదగ్రుఁడై.

మత్తగజంబులు ను, గర్జి కారసువర్ణాకారంబు లగు సువర్ణాలంకారంబులును, నానాంశుకంబు లగు చీనాంశుకంబులు ను, గనుపట్టం జూపిన నవ్వాండివ రుండు నివ్వెఱఁగంది తత్యాగసంపదలకుం గంపితశిరస్కుం డై యందుండన కావటం బగువానిం గొనిపోవం దలంచి. ౯౦

క. అనుచరులచేత మణులును, గనకము మూటలుగఁ ద్వ్రష్టఁ గట్టించి నృపా లుని గర్జని మీఱితి వని, కొనియాడుచు నర్థ మెస్సు గొనుచుం జనియెన్.

ఉ ఆతఁడు చన్నపిమ్మటఁ దదర్థగృహాస్థితుఁ డైన లెంక సం
ప్రీతమనస్కుఁ డై నృపుని పెంపు మనంబున సన్నుతించుచు
న్నీతియు భీతియుం గలుగ నేరుపు చూపడ మిన్నవించె న
త్యాతత మైన యాజ్ఞ వినయంబునఁ జేతులు మోడ్చి సస్కుఁడై ౯౧

క. తనియంగఁ బట్టుకొనిపో, యినయర్థము కొలఁది మీఱు నెఱుఁగఁగవలయు న్ననిపించెద ననవుడు న,మ్మనుజేంద్రుఁడు చులుకఁ జూచి మందస్మితుఁడై.

క. చనువాఁ డని నే నిచ్చిన, చనవునఁ గొని చన్నధనము సంఖ్య యెఱుంగం బనిలే దిఁక నాయర్థము, కొనియేగినవాఁడె యెఱిఁగికొన్నం జాలున్. ౯౪

సీ. అనుడు నా లెంకయు నాశ్చర్యమందుచు ధరణీశ నీకు నుదారమతికి నిప్పటియానతి యొప్పు న ట్లయ్యును బలికెద నా విన్నపంబు వినుము పయి లెక్క కాండ్రను గయికొల్పి వెఱపించి లెంక సవిశ్వాసంబు బొంకు చేసి ధన మెంత గల్గినఁ దాఁ జుల్కఁ జూడక యాయవ్యయంబులు నసుగవలయు వాని వివర మెల్ల వర్గువుగాఁ గూర్చి, నెఱయఁ దెలుపులెక్క లెఱుఁగుకొనుచు వ్యయముపుచ్చి నిలువ వ్రాయించి కైకొంట, ప్రభుల కిదియ నీతివిభవమండ్రు.

గీ. వ్రాఁతకాని నమ్మరా దర్థగృహముల, నుంచకున్న నేమి యెయ్యేకైనాఁడె వెరసు గూడుమనినఁగరణము పండిత, న్యాయమునఁగనర్థముచటఁదెచ్చు.

క. ఒకదెసఁ దెచ్చిన యాయం, బొకదిక్కునఁ జెల్లువ్రాసి యొకదెసవ్యయ మ ట్లొకదిక్కునఁ జనవ్రాసినఁ, బ్రకటంబుగ వాఁడు మిగులఁ బాపాత్ముఁడగున్.

క. వహి వారణాసి యనఁగా, నుహిఁబరఁగిన దిందుఁ గపటమార్గంబుగ నా గ్రహమున వ్రాసినవానికి, విహాపరములు లేవు నరక మెదురై యుండున్.

గీ. రానిపైఁడి చెల్లువ్రాయుట యాయంబు, తక్కునై వ్యయం బదెక్కుడౌట లెక్క తుడుపుపడుట లిపి సందియం బౌట, చెల్లు మఱచుటయును గల్లవనులు.

క. కరణము తనయేలిక కుప,కరణము నిర్ణయగుణాధికరణము ప్రపంచ
న్కరణము పగవారలకును, మరణము నాఁ జెల్లు నీతిమంతుం డైనన్. ౯౯

ఉ. ప్రాలకు సందియంబువడ బ్రాయక మోసము పుట్టనీక గ
ర్వాలసుఁ డై సుఖిం బడక యప్పటికప్పటి కిష్టబుద్ధితో
నేలికచిత్తవృత్తిఁ జరియించుచు నుండెడు నిర్దిష్టుఁడై ద
త్త్వాల మెఱింగి చేయునది కార్యము రాజహితార్థకారికిన్. ౧౦౦

క. అధికారము గైకొని బహు,విధముల నాయకునకు వ్యయము విడిపింపక యే
యధికారి యడఁచె మఱివాఁ, డధికారియ కాక పతికి నాప్తుఁ డగునా.

క. కావున నియ్యెడ నను హిత, సేవకునింగాఁ దలంచి చిత్తములోఁ గా
ర్యావించినయట్లైనను, నావిన్నప మవధరింపు నరలోకేంద్రా. ౧౦౨

వ. అట్లు కా దేని యెత్తువెరసైన నవధరింపు మని మ్రొక్కి యోవశాన్యశిరో
మణి బట్టు పట్టుకొని చన్న రత్నధనస్వర్ణసంఖ్య చూచిన నేఁబదికోట్లు నఱు
వదిలక్ష లయ్యె ననిన నుల్లంబున సంతసిల్లి. ౧౦౩

క. తెలియఁగల దొకటి విను నా,సెలవున నతఁ డర్థ మట్లు చేకొని చనియె
న్వల దనుచు నడ్డపెట్టక, నిలుపక పంపినది చాలు నీపని యొప్పన్. ౧౦౪

మ. అనినం గ్రమ్మఱ మ్రొక్కి వాఁడు నరలోకాధీశ నీయాజ్ఞఁ గాం
చనరత్నాంచితశేఖరంబు కరణి న్సర్వక్షమాధీశులు
న్వినయానమ్రశిరస్కులై శిరముల న్విఖ్యాతిగాఁ దాల్చి నీ
పనివారై నెగడంగ నీసెలవుఁ దప్పం జేయ నే నెవ్వఁడన్. ౧౦౫

క. ఎత్తఱినైనను బతి దన, చిత్తగతిం దగవు మీఱ చెప్పిన పని మా
ఱుత్తర మీయక చేసిన, నుత్తమసేవకుఁడు వాఁడె యుర్వీరమణా. ౧౦౬

చ. పనిచినఁ *బోనివాఁ డొకఁడు పంచినఁ దా నొరుఁ బంచు నొక్కరుం
†డను విడి గా దటంచు నెదురాడు నొకం డొకఁ డొంటిఁ బోవరా
దను నొకఁ డప్పుడు రోగిసను నాపని గాదను నొక్కరుండు పా
మ్మనఁగఁ జలించు నొక్కఁడు జనాధిప ‡యేడ్వురుఁ గష్టసేవకుల్. ౧౦౭

గీ. ఆజ్ఞదప్పుట పతి యాయువు దరపుట, కాన నర్థమెంత యైన నేఁడు
వోవుఁగాక యేను దేవరయానతి, దప్పఁ జేయుదునె హితత్వ మేది. ౧౦౮

*బోయిరాఁడొకఁడు. †దనునిదిగాదటంచు. ‡యేడ్వురు. అని మూ.

వ. దేవ నీయానతి కనుగుణంబుగ సమూల్యరత్నాది సువస్తువు లెల్లను దాఁ పురంబు చేయక చూపిన నతండు తన యిచ్చకొలందిని యవారితంబుగా నింతధనంబు గొని చనియె ననిన మిక్కిలి సంతసిల్లి నవ్వుచు నాతెంకకు లక్షధనంబు కనదనం బొసంగెఁ గావున ౧౦౯

క. నీకంత యీవి గలుగక, యీకడ నను గిడఁ దరంబె యేగు మనిన నా భూకాంతునిగుణము లుపశ్లోకించుచు నృపునకు మగిడి లోనికిఁ జనియెన్.

—॥ మత్స్యదియువబొమ్మకథ ॥—

వ. మఱియు నొక్కశుభావసరంబున. ౧౧౧

క. నెఱయ మగతనము గలిగియు,నొఱపుగ జగములకు దల్లియుం దండ్రియునా నెఱుకపడనొప్పమేనను, దెఱవయు మగయు నైన దేవరఁ దలఁతున్.

మ. అనుచు న్భోజనరేశ్వరుండు మఱియు న్సత్యంబున రత్నకీ లనరమ్యం బగు నమ్మహాసనముపై లక్ష్మీకళాసుందరా ననుఁడై పాదసరోరుహం బిడునెడ న్వారించి యాపాంతకాం చనపాంచాలిక యిట్లను న్సరసవాచాలత్వ మేపారఁగన్. ౧౧౩

ఉ. భోజనరేశ్వరా మగిడి పోయెద వెప్పటి యట్ల క్రమ్మఱన్ రాజనవృత్తి నెక్క ననురాగము సైకొని వచ్చి దింతటం దేజముగల్గునే వసుమతిం బ్రతిలేని వదాన్యవృత్తి మూ రా జగు విక్రమార్కు సరిగాక పదం బిడఁ జెల్ల దేరికిన్. ౧౧౪

క. అతని వదాన్యత్వము విన,మతిఁ బ్రియ మగునేని వినుము *మందారముసం తతదానశాలియనఁ దగు, నతనికి సరిరాక వెలుకనై తలవాంచెన్. ౧౧౫

ఉ. దండితశత్రుమండలుఁడు దానగుణార్కసుతుండు వైభవా ఖండలుఁ డార్తరక్షణనికామసముద్యతమానసుండు మా ర్తాండసమానతేజుఁడు ప్రతాపసమగ్రభుజుండు మేదినీ మండల మెల్ల నేలె గరిమంబున నబ్దులు నాల్గు మేరగన్. ౧౧౬

క. సాహసభూషణుఁ డొకనాఁ, డీహాసమునఁ దలఁచి నిశ్చయించి కలిమిచే నైహికసుఖమగు ధర్మో,త్సాహమునఁ బరోక్షసుఖము సమకూరఁదగున్.

క. ఈరాజ్యంబున కిటుసం,పారసుఖం బొదవె జన్మసాఫల్యముగా నేరీతినైన ధర్మా,చారంబున నొందవలయు స్వర్గసుఖంబున్. ౧౧౮

---

*మందారము సం, తతమును సంతానముఁ దా, నతనికి,

మ. అనుచుం గల్పిత నిశ్చయుం డగు నరేంద్రాధీశుచిత్తంబు వ
ర్తన మూహించి తదీయసమ్మతికి నుత్సాహంబు రెట్టింప నా
య్యనఁ దన్మంత్రివరుండు వల్కె చిరపాయస్వర్గసౌఖ్యంబు నీ
కనుమానం బగునే యనంతసుకృతవ్యాపారసంచారికిన్. ౧౧౯

సీ. అతిథిసత్కారంబు నార్తరక్షణమును దానంబు దయయును సత్యవ్రతంబు
తలచుగాఁ జేసినధర్మంబు తనతోడి నీడయై చనుదెంచుఁ దోడుగాఁగఁ
జిత్తంబు నానాఁటి చింతఁ గూరకమున్న యాత్మసంపదలు పెంపఱకమున్న
ముదిమిచే సంధులు వదలకమున్న రోగంబున నొక్కటఁ గాకమున్న
పుణ్యమార్జింపుఁ డవసరంబునకు మొదల
గట్టియారాధనములు గూడఁబెట్టు టొండ్రు
జీవ మెడలంగ సుకృత మార్జింపఁజనుట
నిల్లు గాలంగ నుయి ద్రవ్వనేగు టండ్రు. ౧౨౦

క. ఈవచనం బితరులకొఱకై వినిపింపంగవలయు నది నీకడ స్వా
భావిక మైనది గావున, నీ వెఱుఁగనియట్టి ధర్మనిరతులు గలవే. ౧౨౧

క. నావుడుఁ గడు మదినుత్సుకుఁ, డై విప్రులయిండ్లఁ గ్రతులు నర్థమువనముల్
బావులు నూతులుఁ జెఱువులు, దేవస్థానములు నిలిపెఁ దేఁకువ కెక్కన్. ౧౨౨

ఉ. ఎక్కడఁ జూచినన్ సుకృత మెన్నిక కెక్కఁగఁ గీర్తిసంపద
ల్పెక్కువిధంబులన్ ధరణిఁ బెంపు వహింపఁగ నానరేశ్వరుం
డొక్కఁడె తీర్థసేవనసముత్సుకుఁడై పరివార మెల్లన
ల్దిక్కులయందుఁ గొల్చి చనుదేరఁగ నర్మద కేగె సొంపుగన్. ౧౨౩

చ. కరితురగాదిసైన్యపరికల్పితమార్గనివేశుఁ డౌచు ద
వ్వరిగి యవంతినాథుఁడు నిరంతరవారివిహారశీలసుం
దరతరరాజహంససముదాయసమాహితశర్మద న్నిజ
స్మరణనివారితోన్నదభుజంగమదుర్మదఁ గాంచె నర్మదన్. ౧౨౪

క. కనుఁగొని కడుఁ బ్రియమున నెమ్మనమునఁ బ్రణమిల్లి యచటి మాంధాతృపురం
బున విడిసి యనుచరులుఁ దా, నునునదికిం జని యెనిజమనోరథములరన్. ౧౨౫

మ. చనియాతీర్థములో సచేలముగ సుస్నానంబు గావించి నూ
తనవస్త్రాభరణానులేపముల గాత్రం బుజ్జ్వలస్ఫూర్తి గై
కొని రాజిల్లఁగ నిల్చి విప్రవరులన్ గోభూతిలార్థాది దా
ననిరూఢిం దనిపె న్రవిగ్రహణపుణ్యంబైనకాలంబునన్. ౧౨

క. కొంకక యిచ్చుచు నెుఁబడి, శంకరుఁ గింకరమనోవశంకరు నురగా
లంకారు నచట నిలిపిన, యోంకారేశ్వరునిఁ గొలిచె నుచితార్చనలన్.

మ. భువనాధీశ్వరు డిట్లు తత్పురమునం బూజించి సేవించి త
ద్భవనప్రాంగణరత్నమండపములోఁ బర్యంతభూమీశులుం
గవులున్ బ్రాహ్మలు నాప్తమిత్రులు నలంకారజ్ఞులున్ నర్తకుల్
న్నవతీసోమము లెంకలుం గొలువఁగా నుల్లాసియై యుండఁగన్. ౧౨౮

మ. ఒకనాఁ డాళిసుఁ జేరుదెంచి సభలో నుత్కృష్టహస్తాగ్రుఁడై
ప్రకటాశీర్వచనక్రమంబున నిజప్రాభవ్య మేపారఁగా
నకళాభిజ్ఞత మూపఁ బూని పలికెన్ ధాత్రీకాంత నీకీర్తికాం
తకు నీరేడుజగంబు లోకమణిసౌధంబై వెలుంగుం గదా. ౧౨౯

ఉ. ఓ నరనాథచంద్ర సుగుణోత్తమ యిచ్చట నాస్తవర్గమున్
దీనుల బట్లను న్ధరణిదేవతలం గవులం బ్రియోక్తి స
న్మానము లేర్పడంగ ననుమానము సేయక యాదరించు నీ
దానమహోత్సవంబు విని దవ్వులనుం డిదె చూడవచ్చితిన్. ౧౩౦

గీ. అర్థినన్నమెత్తువటుగాక నేర్పరి, నన్నమెచ్చువడయు టదియ కడిఁది
నేఁటి కొక్కవిద్య నేమెఱయించెద, నవసరంబు నాకు నానతిమ్ము. ౧౩౧

క. అనుచుఁ దదీయకళానై,ర్మలలాలసుఁ డగుచు నవసరం బిచ్చినఁ దాఁ
గొని నామేళము గూర్చొని, పనివినియెద నంచు వెడలిపోవఁ జేగన్. ౧౩౨

సీ. అయ్యెడ నొకక్రొత్తనైన యుహాసియుఁ డందియ డాకాల సమరఁ బూని
బాగుగాఁ బులిగోరు పట్టి దిండుగఁ గట్టి నునుపార మేనఁ జందన మలంది
తిలకంబు కస్తూరిఁ దిలకించి చొల్లెంబు చెంగులపాగతోఁ జెక్కుటూఱ
నానుమంతు వ్రాసిన యారిగబిగ్గయు వాలుఁగరములజయులక్ష్మి గడలుకొనఁగ
నొకఁడువచ్చె వెనుక న్నొక బింబాధరి, యుంచుదుప్పటియును గమరఁ బెట్టి
మేనికాంతి కప్పులోనఁ గ్రిక్కిఱియంగ, హంసయానయగుచు నరుగుదేర.

క. *వచ్చి నృపుంగని మ్రొక్కిన, నచ్చో నొకమంత్రి యోయుహాసియుఁడ నీ
వెచ్చోటనుండి సతితో, నిచ్చటికరుదెంచినాఁడ వెవ్వఁడ వన్నన్. ౧౩౪

శా. †ఆవీరుండు వినీతుఁడై మనుజలోకాధీశుతో నిట్లనున్
దేవాధీశునిబంట నొక్కెడ బలోద్దీర్ణుండనై తప్పాగిం

---

*వచ్చి పరిణమిల్లినిల్చిన, †ఆవీరుఁడు వినతుండై, భూవరుతో నిట్లు పలికెఁ దాలుపల
రంగా- దేవతలు దానవాసుల, తో వైరముపూని నన్నుఁ దోడ్పడఁదలఁచిర్.

గాసింపం గని నన్ను హీనపదునిం గాఁజేసిన న్వచ్చినా
*నీ వా మేత్షణ నాదుభార్య యిట నా కిష్టంబుగా వచ్చితిన్. ౧౩౫

క. క్రమ్మఱ నింద్రుఁడు రిపునై, న్యమ్ములు పోఁగాడ వచ్చునవసర మని యు
ద్ధమ్మునకుఁ దోడుపడ నను, రమ్మని పుత్తెంచె నిపుడు రాజవరేణ్యా. ౧౩౬

క. నే నరుగఁగ నక్కడ నా, దానవయుద్ధమున సుదతి దలఁకెడు నిట నే
పూనవుఁడు హితుఁడు లేఁడలు, గాన సతికి నీవె ప్రాపుగాఁ దగుదధిపా

ఆ. †పాలనంబు సేయు ప్రభుఁడవు నీకంటె, నొండుచోట నుంచుటురవుగాదు
దిక్కులేని ప్రజకు దిక్కునీవటుగానఁ, దరుణి నరసికొమ్ము తండ్రికరణి. ౧౩౭

క. అని యప్పగించి సభలో, విను వారలుఁ జూచువారు విస్మయమందన్
హనుమంతునొద్దనముతో, హనుమంతుని పగిది నెగసె నాకసమునకున్,

క. మిన్నంట నెగసి నరులకుఁ, గన్నంటిన యాతఁడవ్వఁ గానంబడి య
త్యున్నతగతిఁ గనుపట్టక, చన్నం గని చోద్యమందె జనపాలుండున్.

సీ. ఆమీఁద దేవాసురాహవం బైనట్లు పంచమహావాద్యఘోషతు లెసఁగెఁ
బొడువుఁడు తలఁద్రెంచుఁడనుచుఁ నానిల్వపెడబొబ్బలార్పులు మొనలువడియె
నంతలోపల హనుమంతునొద్దనముతోఁ గూడ నాతని చేయి గూలె ధరణిఁ
దరువాత వాలుతో దక్షిణహస్తంబు నందియతోఁ గాలు నట్లు పడియెఁ
దోడి కాలును దెగితొడఁ గెఁజెంగులపాగ, చొల్లియంబుతోనఁ ద్రెళ్ళెఁ దలయుఁ
ద్రిండుతోడఁ గూడ ‡మొండె మాదిగదొర్లెఁ, గొలువులోనఁ జూడ ఘోరమయ్యె.

ఉ. ఎక్కడి నుండి వచ్చె నితఁ డెవ్వఁడొ యింద్రుని బాట నంచుఁ దా
నిక్కమలాక్షి నుంచి దివి కేగి సురాసుర సంగరంబునం
బ్రక్కన నొక్కెఁ డిట్లు కడికండలు నయ్యె నటంచుఁ గొల్వులోఁ
బెక్కువిధంబుల న్భటునిఁ బేర్కొని విస్మయమందిరందఱున్. ౧౪౨

గీ. మీఁది మునుఁగుపచ్చి మెలఁతుక యులకలు, చ్చక్రమున్వయప్పు దక్కజముగ
నధిపునవయవంబు లామొద్దనంబుతోఁ, గూడఁ దిగిచి బెగడుగొనకపలికె.

క. ఓనరనాయక యింకిట, నేనుండుట తగదు సమరనిహతుని వీరు
న్నా నాథుఁ గూడ నేగెద, నానతి యీవలయు నాకు నగ్గిసొరఁగన్. ౧౪౪

* ఈవా మేత్షణభార్యగా క్షితితలం బిష్టంబుగా వచ్చితిన్ †భూరమెల్లమాన్పు ప్రభుఁడవు- నొండుచోటఁ గార్య మొండుపుట్టు- పాపమెల్ల మాన్పు- ‡కుండములు ద్రెళ్ళె- నెడమకాలును దెగి పుడమిబడియె. గుండలములు ద్రెళ్లె.

క. నాటినిమొదలనె యాతని, చావున కతిఖిన్నుఁడైన జనపతి కృపతో
నో వీరవతి జనకుని, దైవడి నినుఁ బ్రోతు నిక్కు గడఁగకు మనియెన్. ౧౪౫

క. ఇది చాగెడుకొఱకై నీ, పదములకడ నుంచె నిక్కు కతిపోయిన స
త్పదమున కేగెద ననుపుట, మదిఁ జూడఁగ నిదియె తండ్రిమన్నన గాదే.

ఉ. ఆకులపాటుతోడ నశుభాకృతియై యొకవేళనైనఁ బోఁ
కాకుచు లేక సొమ్ములకు నట్టులు పాఁపక పేరఁటంబులం
బోక తొఱఁగి పూఁతలును బువ్వులు దూరముగాఁగ నుండనై
యేకడఁ జేరిన న్విధవ కెగ్గులె కాక †తరింపవచ్చునే. ౧౪౭

క. చచ్చియుఁ జావక తనలో, వెచ్చుచు నియమముల నింక విధవాత్వమున
న్నిచ్చలు మాఁడుటకంటెను, జిచ్చుఱుకుట మేలు సతికి క్షితి నెచ్చంగన్.

క. పతి దుఃఖితుఁ డైనను దా, నతిదుఃఖిత యగుచు నూరి కతఁ డరిగినఁ బీ
డిత యగుచు నతఁడు నచ్చిన, ధృతితోడన నచ్చునది పతివ్రత చుమ్మీ. ౧౪౯

గీ. పుట్టలోనిపాముఁ బట్టు గారడికుండు, బలిమి వెసలఁ దిగియు పగిది నింతి
తోడఁ జచ్చి పతి యధోగతుఁ డైనఁ దా, నుద్ధరించి సౌఖ్యమొందుచుండు.

గీ. అతని కేమికొఱఁత పతి హితంబునఁ బ్రాణ, మిచ్చినాఁడు దివికినేగినాఁడు
రమణుఁడగుచునచట ‡రంభాదిసతులఁగూ, డ్రానకమున్న నన్నుఁగూడ ననుపు.

గీ. ఉరక మాన్పితేని నురివెట్టుకొనియొండె, గుండు గట్టి నీళ్ళఁ గూలి యొండె
విషముద్రావి యొండె విడుతుఁ బ్రాణంబు లా,తగనిచావుకీవు దగులుదున్న.

సీ. §అటుగాక పుణ్యమా నగ్నిప్రవేశంబు చేయుపు నాకీపు చెందదు దిందు
నెన్న ముక్కోటియు నేఁబదిలక్షలు మానవు మేన రోమంబు లుండు
నన్నియేఁడులు స్వర్గ మాత్మనాయకుతోడ ననుగతయై సతి యనుభవించు
వీరునియాల నై విధవ నై యుండుట సముచితం బదిగాదు చాగసిస్సు
తడయ నేల యనుచుఁ దరుణి ప్రార్థించిన, మాఱు పలుక లేక మనుజవిభుఁడు
కొంత యనుమతింప నంతలోఁ దజ్జను, లాయితంబు చేసి రార్తు లగుచు.

చ. ధృతి మతిఁ బొంగి రాజునకు దీవన లిచ్చి నిజాధినాథు మే
నితునుకలుం దదస్త్రములు నించి ఘృతప్లుతచందనేంధనా
న్వితమగు నగ్నికుండమున నింతి వెవ న్నవనీతపుత్త్రికా
కృతిఁ బడి యంతలోనఁ గరఁగెన్ జనులం దఱుఁ బ్రస్తుతింపఁగాన్. ౧౫౪

* ఆవీరభటుని చావునకై † చరింపపచ్చునే, భరింపవచ్చునే, భరింపవచ్చునే.
‡రంభాదిసతులను గూడకుండ- రంభాదులను గూడుకొనక మున్న- §అటుగాన యయుక్తమా.

వ. తదనంతరంబ. ౧౫౫

క. వసుధేశుఁడు వెఱఁగందఁగ, వెస నరిగయు వాలు ద్రింపు విలసిల్లఁగ నా కసమున డిగి యక్షీయుఁడు, కనుగందకవచ్చి తొంటికైవడి నిలిచెన్. ౧౫౬

ఉ. ఒక్కఁడు నిల్లు వచ్చి నిన యోక్కలు ముమ్మఁగ మన్ను తేనికిన్ ద్రొక్కి సురప్రసూనముల మోహనమా నొకదండ యిచ్చి నే నక్కడ కేగి దానవుల నందఱఁ ద్రోలినఁ జూచి మెచ్చుగా నిక్కుసుమస్రజంబు దివిజేంద్రుఁడు నా కొసఁగెం బ్రియంబునన్. ౧౫౭

క. క్రమమున నయ్యింద్రుఁడు నా, కమరపదం బొసఁగి నిజపభాంతరమున ని త్యమునను డఁగవలయుఁగుటుం, బముఁదోడ్తోసరస్సుటంచుఁబనిచె న్సగుడన్. ౧౫౮

క. ఆ రణమునఁ గ్రమ్మఱ, నీకడ కరుదెంచినాఁడ నిఁక నేగెద నే నీకప్పగించి పోయిన, నాకోమలి నిచ్చి మగుడ నన్నునుపు నృపా. ౧౫౯

చ. అనవుడుఁ గొల్వులోనిజను లందఱు మిక్కిలి చోద్యమందఁ గా మనుజవరుండు వాని కొకమాటయు నాడఁగ లేక వి న్నన యగుచున్న మంత్రులు మనంబున విస్మితులయ్యె వీరుఁడా యనిమొన నీవు దీఱిన మృగాక్షియుఁ జిచ్చుఱికె బ్రియంబునన్. ౧౬౦

మ. అనిన న్వారలఁ జూచి వాఁడు దివి నే నా దేవసంఘమ్ములు న్ననుఁ జూడ ద్రిపుసేనలం బఱపి మందారస్రజం బింద్రు మ న్ననగాఁ గైకొని వచ్చినాఁడ నిట నున్నాఁడ న్ననుం దీఱినాఁ డనిన న్తెత్తురె రాచవారలకుఁ గల్లాడ న్ననం బొందునే. ౧౬౧

క. ప్రత్యక్షముగా నెపుర ను, సత్యము వలుకుదురు గాక చదువారు హితా మాత్యులునైమిూరీతని, కృత్యము నడుపుదురు మిమ్ము గెలువం దరమే.

చ. అనుచు నిరుత్తరుం డగుచు నవ్వసుధేశుఁడు వానికంత నా యనిమిషనాథునొండె మఱి యంతకునైనఁ గలంచి తెత్తు నేఁ డని మది నిశ్చయించుకొని యాత్మహితుం డగు లెంకచేతి కాం చనమయముష్టిరమ్య మగు శస్త్రిక యల్లన యందె నందినన్. ౧౬౩

క. ఆవీరుం డప్పుడె నిజభావము ప్రకటముగ నాత్మభామినితోడం దావైతాళికుఁ డగుచుం, గైవారము సేసె జనులు గను వెఱఁగందన్.

క. నరనాథ నిన్ను నపుడవ,నర మడిగినవాఁడ నైంద్రజాలికురీతి న్నరుల నణకించి నీచే, సిరి వొందం జోద్యమిట్లు చేసితి ననియెన్.

గీ. అనుచు వెఱఁగుపడుచు నవనీశుఁ డంతయు, నింద్రజాలమగుట యెఱిఁగి యతని
గారవించి యెన్నికళ లభ్యసించితి, వన్ని నాకుఁ జెప్పు మనుచు నతఁడు.

గీ. పెక్కువిద్యలెఱుఁగఁ బృథ్వీశ వినుఁ గొల్వ, నేర్తుఁ గొన్నికళలు నేర్తుఁ దొల్లి
వానిపేళ్లు వినఁగ వలయును జెప్పెద, దానవైన నన్నుఁ దద్జ్ఞుఁడనరె

వ. కావున నవధరింపుము నాలుగు వేదంబులు ను శిక్షాదిషడంగంబులు ను స్మృతులు ను బురాణంబులు ను బూర్వోత్తరమీమాంసలును న్యాయవిస్తారంబులు ను నితిహాసంబులు ను వాస్తుశాస్త్రంబు ను శ్రౌతతంత్రంబు ను నాయుర్వేదంబును ధనుర్వేదంబును విషప్రతీకారంబును మంత్రప్రతీకారంబును గణితంబును మాంత్రికత్వంబును జలసూత్రంబును సంగీతంబును సాహిత్యంబును సుచిత్రకృత్యంబును నాటకంబులుఁ గావ్యంబులు నలంకారంబులు నానాదేశభాషలు ను సకలలిపిపరిచయంబు ను దూరగమనంబును దూరశ్రవణంబును ధురంధరత్వంబును, వశ్యాకర్షణాది షట్కర్మంబులును వాహనారోహణ చాతురియు జలస్తంభన, శిలాస్తంభన, స్థల స్తంభన, అగ్ని స్తంభన, ఖడ్గ స్తంభన, వాయుస్తంభన, రసస్తంభన, శుక్ల స్తంభన, రక్త స్తంభనాదులును మహేంద్రజాలంబును, నష్టవస్తుసముద్ధరణంబును, జంతితార్థదానముష్టికరణంబును ప్రియభాషణంబును నదృశ్యకరణంబును నదృశ్యాకర్షణంబును కృషివాణిజ్యాదులును శక్తిత్రయంబును రత్నగర్భాది పరీక్షణంబును మనుష్యాది జీవపరిరక్షణంబును ద్యూతాదిఖేలనంబును యమనియమాద్యష్టాంగయోగంబును అష్టావధానంబును వైదికంబును లోకాచారంబు ను రతిరహస్యంబు ను వాద్యకౌశలంబు ను నాట్యంబును బరకాయప్రవేశంబును బరవంచనంబును, ఉపాయాపాయవివేకంబును వీరత్వంబును వాచకంబు ను గందుక కుక్కుటాండ జలపూర్ణభాండ చక్రభ్రమణంబు ను బహురూపనటనత్వంబును వేణుదండభ్రమణంబును రాజముఖ మృగముఖ స్త్రీముఖ చోరముఖ దిఙ్ముఖబంధనంబును మాలికప్రయోగంబు నాకారగుప్తియు భావజ్ఞానంబును గ్రామణికత్వంబును లేఖకత్వంబును బరిహాసంబును వాచాలకత్వంబును నిష్కంపవృత్తియు సర్వజాతి శిల్పపరిశీలనంబును నా నీచతుష్షష్టికళలయందును దేవరసాన్నిధ్యంబునం గొంత పరిచితుండ ననిన.*

క. భూవల్లభుఁ డాతని విద్యావిజ్ఞానంబు మెచ్చి తనసేవల సం
భావింపఁ దలంచునెడన్, దౌవారికుఁ డేగుదెంచి తగ నిట్లనియెన్.

* ఈవచనంబులోని చతుష్షష్టికళలును - ప్రతికొక విధముగా మార్చఁబడినవి, సంఖ్య హెచ్చినది.

క. ఓనరనాయక తమకుం, బూనిక ఫలియింపఁ బాండ్యభూపతిమంత్రుల్
కానుకలు గొంచు దేవరఁ, గానం జనుదెంచినారు కను కనయమునన్. ౧౨౦

గీ. అనిన వారిఁ దోడికొనిరమ్ము నావుడు, మగిడి యేగి యచటివుం ద్రివరుల
వాఁడు దోడుకొనుచువచ్చిదర్శింపఁజేసెఁ, గనకరత్నచయము మునుముగాఁగ.

సీ. ఆమంత్రివరులు సాష్టాంగంబుగా మ్రొక్కి నిలిచి ముందరఁ గరంబులు మొగిడ్చి
జనలోకనాయక యెనిమిదికోట్లు దీనారములు *నూర్వురు వారసతులు
తొంబదిమూఁడు ముత్యంబులు †కావళ్లు నేఁబదినుత్తరీ దపులును
మున్నూఱు జవనాశ్వములును గప్పంబుగాఁ బాండ్యభూపాలుండు పంపెనీకు
నవధరించి దండయాత్ర యుక్కడమాని, యతని గావవలయు నటంచు మ్రొక్కి
‡యున్నఁ గరుణఁజూచి యుర్వీశ్వరుండును, మోదమడర వారి నాదరించి.

ఉ. అర్థులు గోష్ఠి§చేయుసమయంబున వచ్చిన దర్శనంబు న
య్యర్థుల కిచ్చెనేని ప్రభు వాతఁడె కావున విద్యగాని కా
యర్థము ముట్టియుంబులు నపాంగనలుం గరులున్ హయంబులుం
బార్థివుఁ డిచ్చి పుచ్చెఁ దను బాండ్యనిమంత్రులు ప్రస్తుతింపఁగన్. ౧౨౩

క. అట్టిమహోదారుఁడు తన, పట్టణమున కేగి రాయబారులఁ గృపఁ జే
పట్టి సిరి నెగడెఁ గావున, నిట్టిగుణము లేక యొక్క నితరులతరమే. ౧౨౪

క. అనవుడు భోజుండును నె, మ్మనమున నచ్చెక మ్మార్తు మహనీయము తా
గొనములు గొనియాడుచు స, గ్గినయంగ నాసాంపుద్దక్కి యింటికిఁబోయెన్.

శా. శృంగారాధిపతిత్వసంజనితలక్ష్మీసంగతాంగు స్వయ
ద్గంగాకారణపాదపద్ముని ద్రిలోకవ్యాపకుం గోపరూ
పాంగీకారకృతార్థితవ్రజకురంగాక్షీమనోరంగునిన్
సంగీతప్రియు సామవేదిమయుఁ గంసధ్వంసి విశ్వంభరున్. ౧౨౬

శా. గంగాతుంగతరంగసంగతజటాకల్పాయమానాకృతిం
ద్వంగద్భోగభుజంగరాజఫణరత్నజ్యోతిరుద్దీప్తపా
రంగాంకద్యుతిధౌతరాజతగిరింద్రస్థానరంగస్థలీ
రంగద్భృంగిరిటిప్రసంగసుఖపారంపర్యధుర్యున్ శివున్. ౧౨౭

మాలిని. శశధరశకలాంకా స్సననోనిష్కళంకా
విశదగిరినివాసీ [1]విశ్వబాధానిరాసీ

*దయుశతులు నూఱుపురును †కోవిదలు- ‡విన్నవించుటయును విని యవనీపతి §చేయు
గడలందున- చేయునెడ నప్పని 1విశ్వబోధానురాశి.

దశముఖవరదాతా దైత్యహింసావిధాతా
పశుపతిహరిరూపా ప్రాజ్యపూజ్యస్వరూపా ! ౧౭౮

గద్యము. ఇది రాయగజగంధవారణవైరిమండలిక భేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధాము త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూప నూపురసుందరచరణారవింద సనదస్సోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవి వెన్నయామాత్య పౌత్ర హరితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు సాహసాంకుని సాహసోపకారంబులును విటవంచని వంచకత్వంబును గర్వారాంగుని శాపమోక్షణంబును విక్రమార్కునౌదార్యంబు నన్నది యేకాదశాశ్వాసము.

---

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## —। ద్వాదశాశ్వాసము. ।—

---

క. శ్రీపరిరంభణసమయ, ప్రాపితనవకుంకుమాంకభాసురనిజదే
హాశ్లేషమిలితసాంద్రనీరద, రూపు న్సురవిమతనిహితకోపాటోపున్. ౧

చ. హృదయమునం దలంచి ధరణీశుఁడు క్రమ్మఱ నొక్క వేళ నా
త్రిదశవరాసనంబున కతిప్రమదాస్పదమైన రాజ్యసం
పద నరుదేరఁగా నతని భావము గన్గొని యుల్ల నవ్వుచుం
దదనుమతంబు మాన్పి విదితంబుగ నచ్చటిబొమ్మ యిట్లనున్. ౨

## —। ముప్పదియొకటవబొమ్మకథ ।—

క. ముప్పదిమాఱులు క్రమ్మఱి. యిప్పుడ చనుదెంచినాఁడ వాతనికథ లి
ట్లొప్పఁగదా యింకనొకకథ, చెప్పెద నీచేత నీకుఁ జెల్లదు సుమ్మీ. ౩

ఉ. సజ్జనరక్షణోన్నతవిశాలభుజాయుగళుండు సర్వసం
పజ్జితకిన్నరేశ్వరుఁ డపారభటోద్భటవైరిమేదినీ
భృజ్జలజక్షపాకరుఁడు భీమబలాఢ్యుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున గుణోర్జితుఁడై ధర యేలుచుండఁగన్. ౪

క. జననుతుఁడు క్షాంతిశీలుం, డనఁగా నొకభిక్షుకుండు హరిమూర్తికిఁ దా
నెనయగు భూవల్లభునిం, గనుఁగొనఁ జనుదెంచి ఫలము కానుకయిచ్చెన్.

క. ఇచ్చినఁ గైకొని నృపుఁ డిటు, విచ్చేయుం డనుచు గారవించుచు నతనిన్
సచ్చరితుఁ డనుచు నాసన, మిచ్చి యుచితగోష్ఠి జరపి యెలమిని ననిపెన్.

వ. ఇట్లనిపిన తదనంతరంబున- ౭

గీ. ఆఫలంబు తనగృహాధ్యక్షు చేతికి, నిచ్చి లేచి లోనికేగె విభుఁడు
మఱియు నాతపస్విమఱునాఁడు గ్రొత్తగా, నొక్కపండు దెచ్చి యొసఁగెఁ బతికి. ౮

శా. ఆపండు న్నృపుఁ డట్లు పుచ్చుకొని భాండాగారిచే నిచ్చి ని
క్షేపార న్ఫలహస్తుఁడై యవసరం బీక్షించుచు న్భిక్షుకుం
*డేప్రొద్దుం గవితావిలాసమున నర్కేందుప్రతీకాశుఁ డా
క్ష్మాపాలుం గొలువంగ నయ్యె దశవర్షంబు ల్వినోదంబుగన్. ౯

---

* దేహారం గనరాని వేషమున లంకేశప్రతీకాశుఁడై.

చ. అటు లోకనాథునకుఁ గౌస్తుభ మమృతుండు దెచ్చినఁ బెంచినట్టి య
ర్ణవమున కిచ్చె నాకపతియుఁ గైకొని యమ్మగ్గోని చూచి మెచ్చుచుం
గటుకనఁ బాడులం గొలుచుఁగా నొకరత్నము గంజమాత్రి యుం
దటఁ బడియె న్నిజప్రభలఁ దగ్గృహమండప మస్తనిస్త్రగాన్. ౧౦

సీ. ఆరత్న మీక్షించి యాశ్చర్యమున విభుఁ డట గృహాధ్యక్షుఁడైనట్టి లెంకఁ
బిలిపించి యివ్వాళ్ళఫలములు దెచ్చిన్న నరగి యమాణిక్యంబు లైనవాని
నన్నిటిఁ దెచ్చిన *నాడాఁపురికు మెచ్చి నాసికి రం యిచ్చి వరుసఁ బిదప
శాంతిశీలుం డటు చనుదెంచుటయుఁ జూచి యనఘ నీకట్టి యనర్ఘమణులు
నాకు నిచ్చి యేమి నాయెడఁ గైకొనఁ, దలఁచినాఁడ విప్పుడు విలువఁ జూడ
నొక్కరత్నమునకు నుర్వి యంతయుఁ జాల, దిన్నిరత్నములకు నెట్టి యిత్తు. ౧౧

క. అనవుఁడు నాభిక్షుకుఁడో, జననాయక దీపకంబు సమధికగుణమా
పనిగలదు గాన వచ్చితి, ననఘుఁడ వధికుఁడవు సాహసాంకుఁడ వగుటన్.

చ. క్షితివర నాప్రియంబు విను కృష్ణచతుర్దశినాఁటిరాత్రి యు
న్నతమగు మఱ్ఱిక్రింద మసనంబున నున్న పిశాచపంక్తి స
న్నుతు లొనరించి హోమము మనోరథసిద్ధికిఁ జేయువాఁడ నే
కతమున నీవు వచ్చుటకిఁ గ్రక్కున రమ్మటు నాకుఁ దోడ్పడన్. ౧౩

చ. అనవుడు నింతకాలము ప్రయాసమిదేటికి నాఁడె చెప్పినం
బనివిననే యడంచి యొక బ్రహ్మముఁ జేసితి నేఁడు నీవు చె
ప్పిన సమయంబు దప్పక యభీష్టము నీకొనగూర్ప వచ్చెదం
జనుమని వీడుకొల్పి నృపచంద్రుఁడు మానస ముత్సహింపఁగన్. ౧౪

వ. అంతఁ గృష్ణచతుర్దశి వచ్చినం దద్రాత్రి సమయంబున. ౧౫

క. నీలాంకితభూషణములు, నీలాగురులేపనములు నీలాంబరముల్
నీలోత్పలములు నిజదేహాలంకారములు గాఁగ నతఁ డొప్పొందన్. ౧౬

సీ. కరవాలహస్తుఁడై పురము వెల్వడి వీరభావంబుతోఁ బూర్వభాగమునను
డాకినీచండతాండవసముద్దండంబు ఘూకఘూత్కారాది ఘోరరవము
సంహృతశవదాహసమయసముజ్జ్వలచ్చటచటధ్వనివహ్ని సంకులంబు
సకుటుంబవృద్ధజంబుకభీషణాక్రోశసంతతబహుగీతాశాంతరంబు

*నాడాఁపురమునకు మెచ్చినదానికి నవియిచ్చి శిరసు,

కర్పరాస్థిశూలకంకాళనృకపాల, దారుణంబు భూతకారణంబు
నాగభయకసంబునకు నాస్పదం బైన, యాశ్మశానభూమి కరిగి యచట.

క. వటతరువుక్రింద నసలో,త్కట మగు గుంపంబుపొంతఁ దపసిం గని యే
మట పనివంపుము నాకును, కటభావముఁ బాగసి కార్యపరుఁడై యతఁడున్.

వ. ఇచటికిఁ గ్రోశమాత్రమున న్నొక్కశింశుపావృక్షం బున్నది యందు నిలుకుం
డగు బేతాళుం డున్నవాఁ డతనిం దెచ్చుకొమ్మని తనకు మానంబునం గాని
రాఁ డని పంచిన నట చని యనేకవిహంగభుజంగ పిశాచ బ్రహ్మరాక్షస
సతతనివాసం బగు నమ్మహామహీరుహంబు డగ్గఱి తదీయశాఖావలంబిత
తచరణుండు నవలంబమానహస్తుండు ను నధోముఖుండు ను నగు నాభూత
ప్రముఖుం జూచి. ౧౯

సీ. తరుశాఖ కాళ్ళతగు లూడ్చు నంతలోఁ జేతులు పట్టినం జేతు లూడ్చి
మఱియుఁ గాళ్ళం బట్టి మొఱవెట్టు నాతని మెడమీఁద నిడుకొని పురమునకు
బంటున కుచిత మా పనికిఁ బంపక భిక్షుకుండు పేరుగు మోసగోరి పనిచె
ననిదూఱఁగాఁ బిశాచాగ్రేసరుండు మీఁదికెగసి యెప్పటియట్ల తగిలియుండ
భూవరుండు మోసపోయితి నని తాను, మీఁది కేగి వీఁపుమీఁదఁ బెట్టి
కొనుచు డిగ్గి యేమియు ను బల్కనోడుచుఁ, గదలివచ్చెఁ గార్యగౌరవమున.

క. ఆయెడ బేతాళుఁడు జన,నాయకుఁ బరికించి వేఁడి నగవర భూర
వ్యాయామము మఱచి సుఖో,పాయంబునఁ దెరువు జరుగునని కథఁ జెప్పెన్.

వ. అది యెట్లనిన. ౨౨

గీ. అఖిలలోకవిదిత మైన కాశీపురంబునఁ బ్రతాపముకుటుఁ డనఁగ రాజు
కలఁడు వాని కిష్టకాంత సోమప్రభ, యనఁగఁ గలదు పేరు సార్థముగను.

క. ఆదంపతులకు సుతుఁడు ప్ర,మోదాకృతిఁ బుట్టి వజ్రముకుటుఁ డనంగా
మేదినిఁ బరఁగుచు నెన్నఁగ, శ్రీదనరారంగ మరునిచెలువు వహించెన్. ౨౪

క. ఆ రాజసుతుఁడు బుద్ధిశ,రీరుండను మంత్రిసుతుఁడు ప్రియసఖుఁడుగ నా
నారూపవినోదముల వి,హారంబులు సలుపుచు న్మహావ్యసనుం డై. ౨౫

ఉ. ఇష్టసఖుండుఁ దా నడవి కేగి మృగంబుల వేఁటలాడుచుం
గ్లిష్టశరీరుఁ డై కొలని క్రేవ జలార్థము చేరి కన్యకా
సృష్టికి నాద్యలో యనెడు చెల్వలు*గొల్వఁగఁ దారకాంతర
స్పష్టహిమాంశురేఖ కిది సాటియనం బొడఁగాంచె నొక్కతెన్. ౨౬

*గొల్వగ నొప్పుచుండ గళా, స్పష్టహిమాంశురేఖకిది సాటియనందగు కొమ్మఁ గన్గొనెన్.

చ. అనుపగ బాహులోచనకుచాస్యకళ ల్గొనివచ్చినారు తెం
డని బిసమీనచక్రశశిసౌఘము నీళ్ళకు ముంచి వచ్చి శో
ధన మొనరించి చేకొను విధంబున నంబుసహాకరంబు పొం
*తను విహరించు బాలికయు ధారుణినాథతనూజుఁ జూచినన్. ౨౮

క. ఇరువురచూపుల మదనుఁడు,శరములుగాఁ జేసి పులకసముదయ మొదవన్
నరి నయ్యిరువురమనములఁ, గరఁగించె న్ప్రేమరసము గడలుకొనంగన్.

ఉ. అంబురుహాక్షి యప్పుడు ప్రియంబున నొందలిగల్వ పూవుఁ గ
ర్ణంబునఁ జేర్చి, దంతశిఖరంబుల ఘట్టనచేసి, పాదప
ద్మంబునఁ బెట్టి, వక్షమున దాచి, మనోగతి లక్షణంబు వ
క్త్రంబునఁ దోఁపకుండఁ, జెలికత్తెలు గొల్వఁగ నేగె నూరికిన్. ౨౯

క. ఇటనాతుఁడైన వజ్రముకుటుండు ప్రియుఁడు దప్పుఁగొల్వఁగఁబురికా
దట నరుదెంచియు నొకచో, గట నుండెం దెలియరాని †కనుబేటమునన్.

వ ఇట్లాకన్నియ నామగ్రామ జన్మప్రేమాతిశయంబు తెలుపంగమి మిగులఁ బొగు
లుచు దాని తగులు వగల నొగులుచున్న రాజకుమారుం దెలుపకుండుట
బుద్ధిగా దని బుద్ధిశరీరుండు డగ్గఱి నీ కింతచింత యేల విను మాకోమలి తల
మీఁదియుత్పలంబు కర్ణంబునఁ జేర్చుకొనుట కర్ణోత్పలుం డనురాజుగలఁ,
డది దంతఘట్టితంబు సేయుట దంతఘట్టకుం డనం దన్మంత్రి గలం, డది పద
పద్మంబున మోపుటం బేరు పద్మావతి యగు, నది హృదయంబున నత్తుట
నీవ హృదయేశ్వరుండ, వని సూచించె నప్పుడే నిశ్చయించితి నాకర్ణోత్ప
లుండు ‡కుంతలదేశం బేలుచుండు నని వింపుము. ౩౦

ఉ. ఆతనిమంత్రికూఁతు భవదంగనగా నొనరించువాఁడ ర
మ్మా తలపోఁత లేల యని మానవనాథతనూజుఁ గొంచు న
న్నీతనిగూఢ వేషముల నేగుచుఁ §గొంతలకంబు చేరి మా
[1]గ్గాతిథివృత్తి నొక్కతె గృహంబున నిల్చి యనుక్రమంబునన్. ౩౨

సీ. ఈపురం బేలురా జెవ్వఁ డాతని మంత్రి యెవ్వఁ డాతనికూఁతు రెవ్వరొక్కొ
యింతయు నెఱుఁగుదువే యని యడిగిన నుర్వీశ్వరుండు కర్ణోత్పలుండు
తన్మంత్రివర్యుండు దంతఘట్టకుఁడు తత్తనయ పద్మావతి యనఁగఁ గలదు
దానికి నే నిష్టదాసినై వర్తింతు నని యది చెప్పిన నార్తఁ బొంగి

---

*కనిలిచియున్న బాలికయు. †కనుజకనమునన్ ‡కళింగదేశం §నేగికళింగపురంబుసొచ్చి
[1]గ్గాతురవృత్తి.

మంత్రిపుత్త్రుఁడు తనమాట సిక్కువమైన, నతని నూఱడించి యదియ యటకు
దూతిగాఁగ మొదలుదొరకొని తమరాక, చెప్పిపుచ్చి రపుడు చెలియకడకు.

క. అది చని యొక రాకొమరుఁడు, సుదతీ సీతలఁ బెఱిఁగి † సుగుణత యొందం
గదియఁ జనుదెంచి సన్నద, మొదవఁగ నాయింట విడిసి యున్నాఁ డనినన్.

వ. అది విని గూఢభావం బేర్పడకుండ దానిని భర్జించి రోమమిషంబునం గర్పూ
ర మలయజ సాంద్రంబు లగు రెండుచేతుల దాని రెండుచెక్కులం దనపది
వ్రేళ్లు నంట వ్రేసిన నది ఖిన్నవదనయై తిరిగి చనుదెంచి తత్ప్రతాపమానంబు
సూపిన నారాకొమరుం డంక నాశ లే దని యున్న రనినం దత్సహచరుం
డగు బుద్ధిశరీరుం డిట్లనియె. ౩౬

సీ. చింతింప కిఁక దీని చెక్కిళ్లఁ దెల్లని పదిరేఖలుఁగ వ్రేసి పంపు టరయ ,
నిదిశుక్లపక్ష మీపదిదినంబులుఁ బుచ్చి ర మ్మని చెప్పుట నమ్ము మనుచుఁ
దెలిపి యాపదిదినంబులుఁ బుచ్చి యాదాసిఁ బ్రార్థించి యెప్పటియట్ల పనుప
నది తొంటిక్రియ మాటలాడఁగాఁ గుంకుమనూఱెడి సఖిఁ బిల్చినోఁ మీఁద
దీని నడుపు మనుచుఁ దెగి మూఁడువ్రేళ్లువ్రే, యించి వెడలనడిచె వంచనమున
మగిడివచ్చి కుంకుమదవాంకితముఁలొా, వెట్టు సూపె నది యభీష్టమనుర. ౩౭

గీ. చూచి యాస తెమిఁ‡జూకురుఁబొందుచు, చచ్చుటొప్ప ననుచు వెచ్చనూర్చు
వజ్రముకుటుఁ బొగిల వల దసి టెల్సిఖుఁ, డాన గలుగఁ దెలిపి దాసిఁ బిలిచి.

వ. ఆకన్నియ రజస్వల యై యుండంబోలుఁ గావున నెత్తిగా నీమూఁడు వ్రేట్లు
వ్రేయించు త్రోలంచ నిమూఁడు దినంబులుం గడపి యింక నొక్కతో యుంబె
యురుగవలయు నని వేఁడుకొసిన నది యుం గ్రమంబున నాలుగవనాఁడు
కన్యకాసౌధంబునకుం జని మగిడి వచ్చి. ౩౮

మ. నగుమోమొప్పఁగ నేఁటిమాట వినుచు న్నన్నాదరింపంగ నే
నుఁగు తిద్వళి మదంచు కంబము వెనిన్నుగ్గాడి యెతెంచిన
న్నాగన ాల న్వడెలంగరా డనుచు నంభోజాక్షి పీఠంబుపై
డిగజాఱు న్ననుఁ ద్రాటఁ గట్టి విడిచెన్ డెందంబు బిట్టల్లఁగాన్. ౩౯

క. అనవుడు తన్నార్గఁబునఁ, జనుదెమ్మను టయ్యె ననుచు జనపతిసుతునిం
గొనిచని యాపీఠముపై, నసిపె నతని మీఁదివార లటు చేఁదుకొనన్. ౪౦

† సుందర మొదవక - సుగుణత నమునక్. ‡ నుగ్గిక్కుచుఁ బొక్కుచు.

శా. ఆసాధాంతరసీమ రత్నమయపర్యంకంబుపై నుండి త
ద్దాసీలోకకృతోపచారుఁ డగుచుం దాంబూల పుష్పాంగ ను
ల్లాసం బంది చెలంగి కైకొనుచు బాల న్విగ్రహదేహు బరి
హాసోక్తిం బరికించి రాకొమరుఁ డేకాంతంబునం బ్రోడ నై. ౮౧

క. తలఁపునకు నెలవగు నన్నగల పనుగులమకమునఁ బాలఁ గౌఁగిట నిడి మైఁ
బులకలు మొలవఁగఁ దలకొని, పులకగరతసుఖము చవులు చూపుచుఁ గవసెన్.

ఉ. ఈగతిఁ బెక్కునాళ్ళు సుఖయించుచు నుండి నిదేశభూమిలో
నేగతి నున్నవాఁడో తన యిష్టసఖుం డని యిచ్చలోనఁ జిం
తాగతుఁ డైన దీనికిఁ గతం బిటు నేఁటిది చెప్పు మన్న నా
త్యాగమనంబుఁ దన్మతియు నాతని యున్కిలుఁ జెప్పె నేర్పడన్. ౮౩

క. అది విని నీ కాపుఁగు నా, హృదయస్థితి దెలియుఁగు బాణఁ డీ యియ దాసీ
సదనమున నొసలుచుండఁగ, నది యేలా చెప్ప నాతఁ డాప్తుఁడు గాఁడా.

క. అతనికి విం దొనరింపం, బతుగుఁడు నను మెచ్చుఁ బాయసముఁ బక్వాన్నా
న్వితముగ ఘృతముం గొనిచని, యతిముదమునఁ బెట్టి యింటికరు దెన్నుచున్.

సీ. ఆపదార్థములు దయమ్మున సమకూర్చి యాత్రాడు వెంటనే యనుప నతఁడు
చని దాసిగృహమునఁ దనయిష్టసఖుఁ గాంచి బాలిక యిదె యెందు పని చెనినిన
నకట నా యున్కిఁ జెప్పక యుండవైతివి లెమ్మిఁక దిచిత్రంబు దరలుఁ గాన
నతు లిష్టచెలికాని సైతు రె నాకును విషము వెట్టిది దొడ్డ విందువని చెఁ
జూడుమనుచు నతఁడు శునకంబునకుఁ బెట్టె, నది యుఁడినుటతడ వెయువనిఁ గూలె
నెదిరి వారిచిత్త మెఱిఁగి వర్తించెడు, వారి కేల కీడు వచ్చు నరక. ౮౬

వ. ఇట్లు దృష్టాంతంబు చూపి నీ వింక గూఢంబున నేగి యతనికి భోజనంబు పెట్టితి నని చెప్పి మధుపానమత్త యగు నమ్మత్రకాశినికి లోఁదొడ గోరునాట మూఁడు పోటులు వరుసం బొడిచి పాదభూషణమ్ము గొని రమ్మిటఁ గార్యంబు చూచుకొందమని యనిపిన నతండు నని యాక్రమం బొనరించి యందియఁ గొని వచ్చిన. ౮౭

ఉ. అక్కడ మాని తత్పురి యుపాంతమున న్నసనంబులోన గో
రక్కుఁడు మానవాథుఁడు ధరం జరియించుచు విశ్రమార్థ మై
యెక్కడ నిల్చినారో యన సిద్ధులు నద్ధతి సిద్ధవేషు లై
యొక్కమఠంబు గట్టుకొని యుండిరి శూలము కేలఁ గ్రాలఁగన్. ౮౮

క. ఒకనాఁ డటు కర్ణోత్పలు, నికొడుకు మృతుఁడైన నెఱిఁగి నీతివిదుఁడు మం
త్రికుమారుఁడు నృపసుతుచే, తికి నూపుర మిచ్చి సంతఁ ద్రిప్పఁగఁబనిచెన్.
క. అమ్మెద నని చూపుము తెగ, నమ్మకు మఱి దీనిజాడ లడిగిన నీచి
త్తమ్మునఁ గలఁగక నాకీ, సొమ్మిచ్చెను గురుఁ డటంచుఁ జూపుము నన్నున్.
సీ. అనవుడు నట్లగాక యని పురంబున కేగి యంగడి నమ్మఁజూపంగ నొకతె
మనపాప సొమ్మని మంత్రికిఁ జెప్పిన నాతఁడు సొమ్ముతో నతనిఁ బట్టి
పృథివీశుముందఱఁ బెట్టినఁ గలుషించి చెప్పరా యిది యెట్టు చేరె ననిన
నే మ్రుచ్చుఁగాను మీ కీజాడఁ జెప్పెద బంటుల నా వెంటఁ బనుపు మనుచుఁ
గొందఱారెకులను దోడ్కొనుచువచ్చి, నాకుసొమ్మిచ్చెనీగురునాథుఁడనుచుఁ
జూప వారలుమదిఁ గడుఁజోద్యమంది, యట్టి చేష్టంబునకు శంకయుంబునొంది.
క. ఓగురునాయక యీ సొ, మ్మేగతి నినుఁ జేరెఁ జెప్పనేతె మ్మనినన్
జోగులము మేము మాకట, రాఁగూడదు గాన రాజు రమ్మనుఁ డిటకున్.
క. అతనికిఁ జెప్పెద మనవుడు, నతివేగమ యేగి వార లటు వినిపింపన్
క్షితిపతియును మతి నతివి, స్మితుఁడై చను దెంచి కపటసిద్ధుని మ్రోలన్.
క. వినతుఁడై యున్న యాతని, గనుఁగొని నీపీట దంతఘట్టకుసుత డా
కిని రౌ యీమసనములో, నను రాత్రులు దిరుగు నది దిగంబర యగుచున్.
క. ఈరాత్రి నీకుమారుని, మారిమసఁగినట్లు చంపి మలయుఁగ నేనా
ఘోరాతిశూలనిహతిఁద, దూరుస్థలి నొంచి చరణ మొడియఁగ నెగసెన్.
క. కాలు విదిర్చిన నందియ, కీలెడలినఁ బుచ్చుకొంటి క్షితినాయక యే
స్త్రీలను జంపరు గావున, నాలలనను వెడలనుపు మంతియ చాలున్. గీ.
క. అనవుడు వెరఁగంది భయం, బున మంత్రితనూజసౌధమున కంగనలం
బనిచి తొడపైఁ ద్రిశూలం, బునఁ బొడిచిన యట్టులున్న *పోటులు దెలిసెన్.
గీ. తెలిసి శోకరోషకలుషుఁడై యారాజు, మగిడి పురికి నేగి మంత్రికూఁతు
దయ్యమనుచుఁ బ్రజలుదలఁకఁగా వెడలఁగొ, ట్టించెఁజూడనిదికడిందియనుచు.
శా. ఆకన్యామని దుఃఖమూలమునఁ బ్రాణాంత్యంబు చింతింపఁగా
నాకాశీపురరాజపుత్రకుఁడు వ్యాఘ్రాకారుఁడై తన్నన
శ్శోకం బార్చుచు †వెజ్జుజోగిఁ దనయిష్టుంగా నెఱింగించి య
స్తోకం బౌ నిజరాజ్యముం దెలుపుచుం దోడ్కొంచు నేగెం బ్రియన్. గీ.

*భూపతిదెలిసెన్ †వైద్యుజోగి.

క. తదనంతరంబ యొక నాఁ, ట్లుదినములకు దంతఘుట్టకుఁడు సతియును దా మదిఁ *గూఁతుశోకదహనము, పొదివిన ఁబరలోకమునకుఁబోయెం బెలుచన్.

క. ఆపాపము గడపటఁ గా,శీపతిపుత్రుండొ యతనిచెలికాఁడో యీ భూపాలుఁడో వీరలలో, నేపురుషుం డొందుఁ జెప్పు మెఱిఁగినకొలఁదిన్.

సీ. ఎఱిఁగి చెప్పకయున్న నిప్పుడే నీతల పదివ్రక్కలై పడు నిది నిజంబు కావునఁ జెప్పుమా నావుడు నిఁక నూరకుంట మోసం బని యుర్వీవిభుఁడు కామాతురుం డౌచుఁ బ్రేమరాకొమరుండు †తనపనిఁగాఁ జేసికొనుటతగవు సచివసూనుఁడు నిజస్వామికార్యమునకు మర్మంబుసేయుట ధర్మపథము తలవరులచేత వానివర్తనము లెల్ల, మొదలఁ దెలియక యదినిజంబుగఁదలంచి చేసెఁగావునదురితంబుచెందుఁబ్రభుని, రాష్ట్రకృతమైనపాపంబురాజుఁబొందు.

క. అనవుడు బేతాళుఁడు నె,మ్మనమునఁ గొనియాడి యతని మౌనత్యాగం బున నిలువక మొగసి రయం,బునఁ జని తరుశాఖఁ దగిలెఁ బూర్వస్థితితోన్.

వ. ఇట్లు విడిపించుకొని పోయిన. ౯౪

క. ఆనరపతి క్రమ్మఱఁ జని, పీనుఁగు క్రియ నీఁపుమీఁదఁ బెట్టుకొని చనం గా నొకకథనెపమున న,మ్మౌనము విడిపించి యతఁడు మగుడం బాఱెన్.

వ. ఇట్లు మొదలికథంబోలె సారెసారెకుం గథలు చెప్పి మఱుఁగులైన సదుత్తరంబు లందుచుం బరికించుచు నిరువదియేనుమాఱులు దాఁక రాకపోకలనలయించి యతనివివేకంబునకు స్థిరోద్యోగంబునకుం బరిణమించి బేతాళుండు మే లొనగూర్పం దలంచి. ౯౬

క. నరనాథ సర్వలక్షణ, పరిపూర్ణుఁడ వంచు నిన్ను బలిసేయ మదిం బరికించి కపటభిక్షుకుఁ, డరుదుగ నను( దోడి తేర ననుపుట గంటే. ౯౭

గీ. నన్నుఁగొంచు నేగ నిన్నునుసాష్టాంగ, మెఱఁగుమనినమ్రొక్క నెఱుఁగఁదొల్లి నేఁడు నిన్నుఁ జూచి నేర్చెద నిప్పుడు, మ్రొక్కి చూపు మనుము మోసపోక.

క. ఇటు మ్రొక్కుమనుచుఁ జాఁగినఁ, దటుకున నడిదమున వాని తల ద్రెంచి సముత్కట మగు ననలములో నొ, క్కట వైవుము సిద్ధులెల్ల ‡గతివడునీకున్.

చ. అనవుడు నట్ల యియ్యకొని యాతని మూఁపునఁ బెట్టుకొంచు దెచ్చిన మది మెచ్చి వాఁడు మును సెప్పిన రీతిని మ్రొక్కుమన్న నే

---

*గూఁడుశోకదహనంబున †తనదానిగా ‡గనఁబడు.

రనిక్రియఁబల్కిన న్నతి ధరం బ్రణమిల్లిన వానిమస్తకం
బనువునఁ ద్రెంచి పావకున కాహుతిగా నొనరించి సిద్ధుఁడై. ౨౦

గీ. ఆత్మరక్షణాఢ్యుఁ డగువాని నటు వేల్చి, నంత ఘాతనాథుఁ డతని మెచ్చి
యెప్పుడైనఁ దలఁపు మేవచ్చి నిల్చెద, సిద్ధు లెనిమిదియును జెందుననియె.

క. సురలటు పేర్కొని విద్యా,ధరరాజ్యము గలుగ నొసఁగి తద్గుణముల క
చ్చెరు వందుచు నేగిరి భూ,వరుఁడును బేతాళునసిపి వచ్చెం బురికిన్.*

శా. ఈసామర్థ్యము నేర్పుఁ దెంపు ఘనిమాధీశత్వము న్లేక నీ
కీసింహాసన మెక్కు టౌనె మదిలో నీక్షింపుమా యన్న ను
ల్లాసం బెల్లఁ దొఱంగి తద్గుణగణశ్లాఘాపరుండౌచు ల
జ్జాసంగవ్యథఁ గ్రమ్మఱం జనియె భోజక్ష్మాంభుం డింటికిన్. ౨౩

— ముప్పదిరెండవబొమ్మకథ. —

క. తదనంతరంబ యా ము,ప్పదిరెండవబొమ్మయైనఁ బద మిడు మని స
మ్మదమున నిఁకఁబల్కెడునని, మదిలో వలఁదలఁచియతఁడుమఱునాఁడెలమిన్.

క. సన్మునిహృదయారాధితుఁ, జిన్మూర్తిఁ గృపావిశేషు శేషాభరణు
న్మన్మథమదగజకేసరి, జన్మజరామృత్యురహితు సర్వేశ్వరునిన్. ౨౫

క. డెందంబునఁ దలఁపుచు సం,క్రందనమణిపీఠ మెక్కఁ గడఁగెడునెడ నా
కందువ నిలిచిన బొమ్మ వి,సం దిన్నని నగవుతోడ జనపతిఁ బలికెన్. ౨౬

చ. వలదన నేల యిట్టి దురవస్థలఁ బొందఁగ నేల నీకు భూ
తలమున విక్రమార్కుగతి ధర్మము సత్యము సాహసంబు ని
శ్చలముగ నిల్పలేని మనుజప్రభుఁ డీదెస మెట్టఁజూచినం
దలఁపులు నిష్ఫలంబు లగుఁ దత్త్వ మెఱుంగని బుద్ధి నిన్నిటన్. ౨౭

చ. అతని గుణక్రమం బెఱుఁగు మయ్య భుజాబలభీమసేనుఁ డా
తతరణకౌశలార్జునుఁడు ధర్మయుధిష్ఠిరుఁ డార్తరక్షణా
చ్యుతుఁడు కృపాదిలీపుఁ డరిసూదనభార్గవుఁ డర్థబోధవా
క్పతి విభవామరేంద్రుఁ డనఁగా నతఁ డుజ్జయినీపురంబునన్. ౨౮

చ. క్రతువు లనేకము ల్నడిపి గౌరవ మేర్పడ నుర్వి సప్తసం
తతులును నిల్పి వేదనినదంబులు విప్రగృహంబులందు సం

---

*ఈకందమునకు మాఱుగా, వ. అనిన నట్లు విక్రమార్కుండు సంకల్పసిద్ధుండయ్యెఁగావున-
అని యొక ప్రతిలోఁ గలదు.

తతముఁ జెలంగ దీను లతిదానముల న్నగడంగ ధర్మసం
గతి మెఱయించె రాజ్యవికారము లెవ్వియుఁ జెందకుండఁగన్. ౭౯

చ. కఱవులపే రడంచి యుదకంబుల నెప్పుడు నర్ణవాకృతిం
జెఱువులు నిండియుండఁ దమసీమలఁ దప్పక నాల్గుజాతులుం
దఱచుగ ధర్మము ల్నెఱపఁ*దస్కరజాతుల నప్రసుప్తత
న్నెఱయఁగనీక సజ్జనులు మెచ్చఁగ శాశ్వతకీర్తికాముఁ డై. ౮౦

ఉ. అంబుజమిత్రు వంశ మని యార్యులు సన్నుతి సేయఁగా సము
ద్రంబులు నాల్గుమేర లగు ధారుణి యంతయు నేలుచుం బ్రతా
పంబున రాజు లెల్లఁ దన పంపు చరింపుచుఁ గొల్వఁ గార్యఖ
డ్గంబుల వైరులం దునిమె గట్టిగ సత్యము నిల్పెకోటికిన్. ౮౧

సీ. సత్త్వంబునను మహైశ్వర్యంబుగా గెల్చి వసుధేశులను వాత్మవశులఁ జేసి
వరరత్నకనకాది వస్తువు లన్నియుఁ దనసొమ్ముగాఁ జేసికొని యతండు
హయమేధములు మొదలైన యాగములందుఁగూడి దేవతలెల్లఁదోడుపడఁగ
బడుగులు వేఁడినఁ బ్రాణంబు లైనను వంచింప కొసఁగెడు వ్రతము వట్టి
సర్వదిక్కులందుఁ జాటించి యర్థులఁ, గూడఁ దిగిచి వారు గోరినట్టి
యాళ్ళ నర్థమును యథోచితంబుగ నిచ్చి, శాసనంబుగాఁగ శక మొనర్చె.

వ. భువిలో నభూతపూర్వంబు నద్భుతంబు నగుకృత్యంబు శకం బనంబడుఁ
దొల్లి జరుగు శ్రీరామశకంబు యుధిష్ఠిరశకంబు నడుంచి నిజశకంబు నిల్పిన
నందానందాది సంవత్సరాద్యమ్మున విక్రమార్కశకంబు చతుర్లక్షజ్యోతి
శ్శాస్త్రగతిప్రవర్తకం బయ్యె ౮౩

గీ. నకుమ శాలివాహనశకంబు గలిగియుఁ, జెడక యుత్తరమునఁ బుడమిలోన
నెన్నిచూడఁ బదియు నెనిమిది వేలేండ్లు, లతనిశకము రూఢిఁ జలరఁగలదు. ౮౪

క. ఈపాటి మహిమ గుణములు, నీపాలం గలిగె నేని నేఁ జెక్కు వృథా
టోపంబులు వల దని యో, క్ష్మాపాలక నిన్ను మాన్పఁ జలమో ఫలమో.

క. అని చెప్పి మఱియు నాతని, మన మలరఁగఁ బలికె నిన్నిమాటలు మానే
ర్పున నతనిమహిమకొలఁది, †గ్వాసిపించితి మింతె కాక నీవల్పుఁడవా.

క. నరనారాయణులనఁగాఁ, బరఁగెడు హరిమూర్తు లుర్వి ఫల్గునదామో
దరులై పుట్టిరి నాఁ డా, నరుఁ డత డై పుట్టినాఁడు నరవరతిలకా. ౮౭

* దస్కరజాతుల † వినిపించిననింతనేను.

క. ఈకలియుగమున విద్యల, కేకడఁ జేపట్టు శేమి యెఱిఁగి పలికి వా
ణీకాముని వినిపించిన, నాకనుల భవుండు సెప్పె నచ్యుతుతోడన్. ౮౮

*గీ. అచ్యుతుండు విద్యలైశ్వర్యమునఁ గాని, మెఱయ వచ్చుఁ జెప్పి మెఱుఁగు గలుగ
నరునిఁ బుట్టఁ బంచె నరపతిత్వము గోరి, యతఁడు నవని నీవయై జనించె.

క. నరునకు నారాయణునకు, నరయఁగ భేదంబు లేదు హరి యొక్కఁడు న
య్యిరువురయై పగుఁ గావున, వెరవుగఁ బరికింప నీవ విష్ణుఁడ వనఘా.

క. ఈపుణ్యుని నినుఁ జూచిన, శాపావధి గలిగెఁ గల్మషం బడఁగెఁ గుణో
ద్దీపక! "నావిష్ణుః పృథివీపతి" యనుకీర్తి నీకు విహితం బయ్యెన్. ౯౧

చ. అన విని చోద్యమంది వసుధాధిపుఁ డప్పటి శాపకారణం
బొనరఁగఁ జెప్పు మెవ్వ రని యుత్సుకుఁడై తను వేఁడినం గ్రమం
బున నది క్రమ్మఱం బలికె భోజనృపాలక! పార్వతీసఖీ
జనులము నేము దేవి కనుసన్నల దగ్గఱి కొల్చు మెప్పుడున్. ౯౨

క. ఒకనాఁ డేమును నయ్యంబికయును విశ్రాంతి కేగి శుకపికభృంగ
ప్రకరపరితోషకర మగు, నొకవనమున విరులు గోయుచున్నెడ వేడ్కన్.

సీ. కన్నుల విని గాలిఁ జెన్నొందు నందియ యడుగుఁదమ్మికి బెడఁగడరఁ జేయ
నందిని నులికించు పెందోలు హారంబట్టుకైవడి నునుపారఁ గానె వోసి
తలఁచినయంత నె వలపులఁ దలకొల్పు వెలిపూఁత మేనెల్లఁ గలయఁబూసి
జక్కవకవ కెదురెక్కు హా రేవెలుఁ గెలమితో జడలపై వెలుఁగుచుండ
విసము మెడనుండి యుసుదీపి¶ వెలికిఁ దోఁపఁ, గేలశూలంబు ఫణిపతిలీల మెఱయ
మిండజంగమై యామంచుఁ గొండకూఁతు, నెదుటికరు దెంచె మ్రుక్కంటిచదురులాఁడు

క. ఆచందము గనుపట్టం, జూచిన యావేళ మనసిజుఁడు మున్నుఁ దెగం
జూచి తనకమ్మఁదూపుల, మాచిత్తము లెల్లఁ గరఁచె మానము లెడలన్.

క. పులకించెఁ జెక్కు లలికం, బుల లేఁజెమ రొత్తె నధరముల నద రొదవెన్
వలువల గనయము లూడెం, †బలుకమఱచి యుంటిమేము ప్రతిమలమాడ్కిన్.

క. ఆతఱి నయ్యంబిక మా, చేతోగతు లెఱిఁగి కనలి చెలిమికి వెలిగా
భూతలమునఁ ‡బుత్తళులై, చైతన్యము లుడుగుఁ డనుచు శాపంబిచ్చెన్.

---

* అచ్యుతుండ విద్యలైశ్వర్యమునఁ గాని, మెఱయ వనుచుఁ జెప్పి యెఱుక గలిగి
యవనిఁ బుట్టఁ బంచె నాహరి యిపుడు నీ, వై జనించినాఁడ వవనిపాల.

¶ దీప్తి † బలుకమఱచియుంటిమేము ‡ బుత్తికలై.

ఉ. ఆక్రియ శాప మిచ్చిన భయంబున నందఱ మాత్మ లజ్జ ర
త్యాక్రియ సన్నిపాత ముసుగంబడు కైవశిఁ గాముని క్రియో
పక్రమ మానసం దెలిసి పార్వతికిం బ్రణమిల్లి తల్లి మా
కేక్రియ శాపమోక్ష మగు నింత దలంచుట మాతృకృత్యమే! ౯౮

మ. అనుచుం బ్రార్థన చేసిన న్విని కృపాయత్తాత్మయై మీరు కాం
చనపాంచాలిక లై జనించుఁ డొక ప్రస్తావంబునం బుణ్యవ
ర్తనునిం జెప్పఁగ వాక్యసిద్ధి యగుఁ దత్కాలంబు మీశాపమో
చనమౌఁ బొందని వీడుకొల్పిన మనస్తాపంబునం బిమ్మటన్. ౯౯

వ. ఒక్కమాఱె భూలోకంబునకు రానోడి, మాసంప్రార్థన విశ్వకర్మనిర్మితం బగు నయ్యింద్రసింహాసనంబున నట్లుండి పదంపడి భూమికి వచ్చి యీయుత్తమ నాయకు గుణకథనార్థమై నిన్నిన్నిమాటలు వారించితిమి. నాపేరు శృంగారతిలక యనం బరఁగు, వీరలు జయయు ను, విజయయు, మలయావతియు, ననంగసంజీవనియు ను, గంధర్వసేన యుఁ, బ్రభావతియు, సుప్రభయు, సంభోగనిధియు, సుభద్రయుఁ, జంద్రికయు, కురంగనయనయు, ననంగధ్వజయు, నిందువదనయు, విలాసరసికయుఁ, గోమలియు, సౌందర్యవతియు,లావణ్యవతియు, లజ్జావతియు, నిందుమతియు, జనమోహినియును, విద్యాధరియు, హరిమధ్యయు, సుఖప్రదాయినియుఁ, బ్రబోధవతియు, మలయవతియు, హంసగమనయు, నంగసుందరియు, సుకేశియుఁ, జతురికయు, వామాంగియుఁ, దలోదరియు, *నను పేరులు గలవారని యెఱుంగు మిట్టి మేమును- ౧౦౦

క. బొమ్మలమై యీమణిపీ,ఠమ్మున బహుకాలముండి డస్సితి మని చి
త్తమ్ములఁ బొగులఁగ మాభా,గ్యమ్మున నీతోడ మాట లాడంగలిగెన్.

క. కష్టంబు వీడె నీకే,యిష్టం బది వేఁడు మిప్పు డిచ్చెద మనినన్
సాష్టాంగ మెరఁగి భోజుఁడు,హృష్టుండై పలికె వారిహృదయము లలరన్.

క. మీకృప సంపద లన్నియు, నా కుంచగ నేమి ప్రార్థనము భవదీయా
లోకము గలిగెను బుణ్య,శ్లోకుండ నైయుండఁ గంటి లోకులు పొగడన్.

క. అని వినయోక్తులు వలికినఁ, గొనియాడుచు నిలిచి రాజకుంజర నీచే
సిన యుపకారమునకు నే, మని ప్రత్యుపకృతి యొనర్ప నర్హము మాకున్.

* మనోహరియు; మానవతియు, పద్మపాణియు, నీలవేణి, శుకవాణియు, పులినశ్రోణియు, నిరుపమయు నను పేరులు ప్రత్యంతరములలో నున్నవి. వీనింజేర్చిన ౩౨ కు మించినవి.

చ. సకలకళాప్రవీణుఁడవు సజ్జనరక్షణదక్షిణుండ వం
ధకరిపుభక్తిశీలుఁడవు దానవినోదివి సర్వభావభా
వకుఁడవు విష్ణుమూర్తివి దివానిశముం గవిపాఠకార్థిగా
యకనుతిశాలి పృథ్వీపతి వల్లుఁడ వౌ భువి భోజభూవరా! ౧౦౫

శా. నీ కేవాంఛయు లేకయున్న వినుమా నిన్నెవ్వఁ డీక్షించినన్
మాకిష్టంబు సరస్వతీవిభవ మామర్త్యంబు వేపొందు, వా
క్ప్రౌఢుండై విలసిల్లఁ జేసెదము భూపాలాగ్రణీ నీయశం
బాకల్పంబుగ నొప్పఁగాత జనలోకానంద మై సాంద్ర మై. ౧౦౬

సీ. కన్ను లయ్యెను బండికన్ను లయ్యెను జంద్రసూర్యు లెవ్వనికడ సొంపుగనిరి
సుతుఁడయ్యె రథము పై సూతుఁడయ్యెను సురజ్యేష్ఠుఁ డెవ్వనికడ శ్రేష్ఠుఁడయ్యెఁ
దల్పంబునయ్యె నాకల్పంబు నయ్యె నాగేంద్రుఁ డెవ్వనికడ నెన్నఁబడియెఁ
బదమయ్యె మస్తకాస్పద మయ్యె నాకాశసుధ్య మెవ్వనికడ మహిమ కెక్కె
నట్టి యుభయమూర్తి హరిహరనాథుండు, దేవదేవుఁ డిష్టదైవ మగుచు
నెరయఁ బ్రోచుఁగాత నీకొల్వువారల, భూజనేంద్రభూజ భోజరాజ. ౧౦౭

క. పర్యాప్తంబుగఁ గథ లీ, మర్యాద న్విన్నయట్టి మానవులకు నా
దార్యంబును దెగువయుగాం, భీర్యమ్మును బ్రియమునయముఁ బెంపునహించున్

మ. అని దీవించి యుమాసఖీజనులు దివ్యాకారసంపత్తి సొం
పున నాకాశమున న్మెఱుంగులక్రియం బొల్పారునుల్లాసపం
జనితప్రౌఢవచోవిలాసముల నాశ్చర్యంబు రెట్టింప నా
జను లెల్లం దముఁ జూడఁగాఁ జనిరి భోజశ్రేష్ఠు నగ్గించుచున్. ౧౦౯

శా. భోజేంద్రుండును నైక్యరామి హృదయాంభోజంబులోఁ గాంచి ని
ర్వ్యాజంబై విలసిల్లు యత్నమున సద్వత్సన్నిధిన్ దానిపైఁ
దేజోమూర్తిఁ ద్రిలోకవంద్యుని *మహాదేవు న్నను న్నిల్పి త
త్పూజాలబ్ధ వరప్రసాదమహిమన్ భూమండలం బేలఁగన్. ౧౧౦

శా. సద్యోనిర్ణయ వాదులు న్సరసులు †సంగీతకావ్యక్రియా
విద్యావంతు లనంతశిల్పరచనావిజ్ఞానులు న్సర్వసం
పద్యోగ ప్రథమానకీర్తియుతులు న్సభామనోరంజనా
హృద్యాకారులుఁ బుణ్యవర్తనులు నై యేపారి రుర్వీజనుల్. ౧౧౧

---

* మహాదేవున్నివున్నిల్పి. మహాదేవుం దగన్నిల్పి † సంగీతవాద్యక్రియా.

మ. అనుచుం జెప్పిన నద్రిజాత మిగులన్ హర్షించి యోదేవ యే
నును బూర్వంబునం గొంత వింటిం బిదప న్నూతన్ప్రసంగంబున
న్వినని౦పాగతి నేఁడు విస్తరముగా వింటి న్మహాసీరుం డా
తని సామర్థ్యము నీ ప్రసాదమునఁ జిత్రం బయ్యె మృత్యుంజయా. ౧౧౨
క. *నాకోరిన కథ లెల్లను, నేకతమునఁ దెలియ నానతిచ్చితి దేవా
యీకలియుగపర్యంతం, బీకథలు ప్రసిద్ధి కెక్కు నిట నీకరుణన్. ౧౧౩
మ. ‡అని యీరీతి నుమామహేశులకు సాంద్రానందసంధానమై
వినని౦పై కవిసమ్మత ప్రకృతమై విద్వజ్జనానందజీ
వనమై పావనమై సుహాసనకథాద్వాత్రింశి కర్ణామృతం
బన నెల్లప్పుడుఁ జెల్లుఁగాత భువిలో నాచంద్రతారార్కమై ౧౧౪
శా. అంభోరాశిజలప్రపూర్ణ పవ్యాప్తి వ్యాసక్తచిత్తాంబుజుం
గుంభీసంభవముఖ్యసర్వమునివాగ్గుంభస్తుతారంభునిన్
జంభారాతిసమీహితాయుసముపాస్తంభాంతసంఘాత సం
రంభాటోపవిదారితారివరుఁ బ్రహ్లాదప్రతిష్ఠాపరున్. ౧౧౫
శా. బాణాగారముఖాభిరక్షణగుణప్రారబ్ధ యుద్ధక్రియా
క్షీణోపేంద్రసుహృత్త్వకృత్యుని దృఢాంగీకారసన్మానిగీ
ర్వాణాధీశసమర్చితాంఘ్రియుగళు న్వామాంగవిన్యస్తశ
ర్వాణీమగ్నమనోంబుజుం ద్రిభువనావష్టంభుసిన్ శంభునిన్. ౧౧౬
మాలిని. నవహిమకరజూటా నందితామర్త్యకూటా
జవనవృషభవాహా శంఖచక్రాంకదేహా
ధవళనిజశరీరా దానవధ్వంసకారా
శివమురరిపురూపా శిష్టదృష్టస్వరూపా. ౧౧౭
గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశసర్వాధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూపనూపురసుందరచరణారవింద సనదక్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొలని వెన్నయామాత్య పౌత్ర హారితసగోత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బయిన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు బేతాళహరణంబును, బద్మావతి యితిహాసంబును, విక్రమార్కుని యుష్టప్రసిద్ధిసంసిద్ధియుఁ దన్మహాసామర్థ్యంబును, బొమ్మలశాపాగమనమోక్షప్రకారంబును దదీయ నిజస్వరూపప్రాప్తియు నన్నది సర్వంబును ద్వాదశాశ్వాసము.



* నాకోరినకోర్కె లెల్లయు ‡ అనుచుం బ్రార్థనచేసెం గావున సాంద్రానందసంధానమై